# బ్రహ్మసత్యం జగన్మిథ్యా

- శ్రీ ఓంకారానంద బ్రహ్మచారి, శ్రీవ్యాసాశ్రమము

ఆధివ్యాధిపరిపీడుతుడై, జరాజన్మ మరణాది దుఃఖదావాగ్ని దగ్ధుడై, అజ్ఞానాంధ తమస నిమీలిత నయనుడై, భౌతిక విషయాలచే ఆసక్తుడై, కదలీఫలవత్ నిస్సారమైన సంసారంలో త్రివిధ ఏషణాలచేత సంలగ్నుడై, జలప్రవాహం వలె అనిత్యమైన సంసారమందు కర్తృత్వ భోక్తృత్వాభిమానుడై, ఊర్ధ్వ మూలం అధోశాఖలు కలిగిన సంసార వృక్షమందు అధ్యాసచే గ్రస్థుడై, కర్మచేత బద్ధుడైన జీవుడు ఆనంద ప్రాప్త్యర్థం, మోక్షాన్ని పొందడానికి, త్రివిధతాపాలను నశింపజేసు కోవడానికి, మోహాన్ని తొలగించు కోవడానికి జగత్ శరణ్యం అయిన శుద్ధ- బుద్ధ- ముక్త- స్వభావుడైన జగదీశ్వరుని ఆశ్రయించాలి.



**"సమస్త ప్రపంచము పంచభూతములచే నిర్మింప బడినది. కావున అదియు స్థిరముకాదు. అటులనే అతల వితలాద్యధోలోకములేడును, భూర్భువా ద్యూర్ధ్వ లోకములేడును శాశ్వతములు గావు. మరియు బ్రహ్మవిష్ణుశివస్థానములు గూడ పునరావృత్తినే గలిగించుచున్నవి. అందుచే బ్రహ్మమొక్కటే సత్యం. అదియే సనాతనము".**

-శ్రీ మలయాళస్వాములవారు

**బ్రహ్మ స్వరూపం -** జగదీశ్వరుడు వేదాంత మతం చేత 'బ్రహ్మ' గా చెప్పబడుతున్నాడు. అటువంటి 'బ్రహ్మస్వరూపం' ఉపనిషత్తులలో విచారితము. మాండూక్యోపనిషత్తులో బ్రహ్మ స్వరూపం ఇలా వివరింపబడింది.

**ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోన్తర్యామ్యేష యోనిః సర్వస్య ప్రభవాప్యయో హి భూతానామ్॥**

ఇతడే సర్వేశ్వరుడు. ఇతడే సర్వమూ తెలిసినవాడు. ఇతడే అన్ని ప్రాణుల లోపల కొలువై నడిపిస్తున్నాడు. సమస్తానికి మూల కారణం ఇతడే. ప్రాణుల ఉత్పత్తికి వినాశనానికి కూడా ఇతడే కారణం.

ఆ పరమాత్ముడు అద్వితీయుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, సాక్షి, చేతన స్వరూపుడు నిర్గుణుడు. అతనికంటే ఉత్కృష్టమైనది ఏదీ లేదు. ఆయన శక్తి అపూర్వం వివిధ గుణ స్వరూపుడు. ఆయన ఊర్ణనాభుడై మాయచేత సకల జగత్తును సృష్టించి సంహరిస్తున్నాడు.

**యస్తూర్ణ నాభః ఇవ తన్తుభిః**
**ప్రధానజైః స్వభావతః॥**

**దేవ ఏకః స్వమావృణోతి**
**సనో దదాద్బ్రహ్మాప్యయమ్॥**

(శ్వేతాశ్వతరోపనిషత్తు)

స్వభావముగా ప్రకాశించువాడును అద్వితీయుడును అగు పరమేశ్వరుడు సాలెపురుగు తనయందు పుట్టిన దారముల చేత ఎటుల చుట్టబడుచున్నదో అదేవిధముగా అవ్యక్తము నుండి పుట్టిన నామరూపకర్మాది పాశముల చేత ఆవరింపబడుచున్నాడు. అట్టి పరమేశ్వరుడు నాకు బ్రహ్మాత్మైక్యభావమును కలుగజేయుగాక!

**ఏకోదేవ సర్వభూతేషు గూఢ**
**స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా।**
**కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస**
**స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥**

(శ్వేతాశ్వతరోపనిషత్తు)

అద్వితీయుడును ప్రకాశ స్వరూపుడును అగు ఆ పరమేశ్వరుడే సకల ప్రాణులందు అంతరాత్మ భూతుడై ఉన్నాడు. ఇతడే ఆయా ప్రాణులొనర్చు నానావిధ కర్మలకు అధిష్ఠాత. ఇతడే సర్వభూతాధి వాసుడను సర్వద్రష్టయు చైతన్యమును కలుగ జేయువాడును నిరుపాధికుడును సత్త్వాదిగుణ రహితుడును అగుచున్నాడు.

**బ్రహ్మసత్యం –** ఏది సత్యం? ఏది అసత్యం? ఏది మిథ్యా? అని జిజ్ఞాసా కలిగినప్పుడు శ్రీశంకర భగవత్పాదులు ఇలా వచించారు. "యదురూపేణ యన్నిశ్చితం తదురూపం న వ్యభిచరతి తత్ సత్యమ్." ఏ వస్తువైతే శాశ్వతమో, పరివర్తన రహితమో, అవినశ్వరమో అది సత్యం. మిగతా అంతా మిథ్యా. పరివర్తన శీలత్వం ఉండడం వల్ల జగత్తు మిథ్యా. పరివర్తన శీలత్వం లేకపోవడం వల్ల బ్రహ్మసత్యం.

శ్రీ మలయాళదేశికేంద్రులు ఇలా వచించారు.

**పఞ్చభూతాత్మకం విశ్వం హ్యవశ్యం నశ్వరం భవేత్।**
**అధోలోకాస్తథైవ స్యురూర్ధ్వలోకా న శాశ్వతాః॥**
**పునరావర్తినో బ్రహ్మవిష్ణుశమ్భుపదాదయః।**
**నిర్వాణమేవ శిష్టం తత్సనాతన మితీరితమ్॥**

(శ్రీమలయాళ యతీన్ద్రగీతా)

సమస్త ప్రపంచము పంచభూతములచే నిర్మింబడినది. కావున అదియు స్థిరము గాదు. అటులనే అతల వితలాద్యధోలోకము లేదను, భూర్భువాద్యూర్ధ్వ లోకము లేదను శాశ్వతములు గావు. మఱియు బ్రహ్మ విష్ణు శివస్థానములు గూడ పునరావృత్తినే గలిగించుచున్నవి. అందుచే బ్రహ్మ మొక్కటే సత్యం. అదియే సనాతనము.

వేదాంత దర్శనంలో బ్రహ్మ నిర్వికల్పం, నిరుపాధి, నిర్వికారంగా అంగీకరింపబడింది. ఆ బ్రహ్మ ద్వివిధం నిర్గుణం సగుణం. నిర్గుణ బ్రహ్మ పారమార్థ దృష్ట్యా సచ్చిదానంద స్వరూపం. అదియే జగత్తుకు ప్రకాశం. అతని సత్తాచేత సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారు. అజ్ఞాన ఉపాధ్యవచ్ఛిన్నమైన బ్రహ్మ సగుణ రూపాన్ని పొందాడు. అదియే నానారూపాలచేత, నానాదేవతారూపాలను పొందాడు. అందువల్ల కఠోపనిషత్తులో "ఏకస్తథా

సర్వభూతాంతరాత్మ రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ." ఏకం రూపం బహుధా యః కరోతి." అని శ్రుతి ప్రమాణయుక్తంగా చెప్పబడింది.

ఆ బ్రహ్మ సమిష్టిరూపంగా ఈశ్వరునిగా, వ్యష్టిరూపంగా ప్రాజ్ఞునిగా అథవా జీవుడుగా చెప్పబడుతున్నాడు. భగవంతుని తెలుసుకోవడం వల్ల సర్వం తెలియబడుతుంది. బ్రహ్మైకత్వ జ్ఞానం చేత శోక మోహాలు ఉండవు. ఈ విషయాన్నే శ్రుతి అనేక ప్రమాణాల చేత – "ఈశావాస్య మిదం సర్వమ్." "యైదదాత్మ మిదం సర్వమ్." "యస్మిన్ విజ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి." "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో." "తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః." బ్రహ్మసత్యం అని తెలుపుతుంది.

**జగత్ మిథ్యా –** ఆస్తికులు వేదాంత మతానుసారం 'జగత్ మిథ్యా' అని తలుస్తారు. ఈ విషయంలో అనేక విప్రతిపత్తులు ఉన్నాయి. వేదాంత మతానుసారం మాయ యొక్క శక్తి రెండు విధాలు. 1. ఆవరణ శక్తి, 2. విక్షేపశక్తి. ఆవరణ శక్తి మన నిజస్వరూపాన్ని కప్పిపుచ్చుతుంది. విక్షేపశక్తి ఆకాశాది పంచభూతాలను సృజింపజేస్తుంది.

**శక్తిద్వయం హి మాయాయా విక్షేపావృతిరూపకమ్।**
**విక్షేపశక్తిః లింగాది బ్రహ్మాండాంతం జగత్ సృజేత్॥**
**అంతర్దృగ్దృశ్యయోర్భేదం బహిశ్చ బ్రహ్మసర్గయోః।**
**ఆవృణోత్యపరా శక్తిః సా సంసారస్య కారణమ్॥**

మాయయే– అవిద్యా, అజ్ఞాన, అధ్యాస, అధ్యారోప, వివర్తాది శబ్దాలచే వ్యవహరింప బడుతుంది. వేదాంతానుసారం త్రివిధా సత్తా స్వీక్రియతే. 1.ప్రాతిభాసిక సత్తా, 2. వ్యావహారిక సత్తా, 3. పారమార్థిక సత్తా. ప్రాతిభాసిక సత్తా – కొంతకాలం పాటు ఉంటుంది. తరువాత నశిస్తుంది. ఎలాగంటే రజ్జుయందు సర్పభ్రాంతి. శుక్తియందు రజత భ్రాంతి. వ్యావహారిక సత్తా – వ్యవహారంలో జగత్ సత్యంగా గోచరిస్తుంది. కాని సత్యం కాదు. పారమార్థిక సత్తా – పారమార్థిక దృష్ట్యా జగత్ మిథ్యా. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని శ్రుతి ప్రమాణం. జగత్ వివరిణామి అవ్వటం, నశ్వరమవ్వటం, పరివర్తన చెందటం, అశాశ్వతం అవ్వటం అనే కారణాల చేత జగత్ మిథ్యా. తాత్త్విక దృష్టిలో బ్రహ్మసత్యం జగత్ మిథ్యా అనేది సిద్ధాంతం.

నాడు బ్రహ్మయొక్క సత్యత్వాన్ని, జగత్ యొక్క మిథ్యాత్వాన్ని, సనాతన వేదాంత జ్ఞానసభలు, చాతుర్మాస్య మహావ్రతాలు, ఓంకార సత్రయాగాల ద్వారా జ్ఞాన భాస్కరుడై ఘంటాపథంగా తెలిపిన మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు నేడు మనందరికి ఆ జ్ఞానం కలిగేలాగ అనుగ్రహించు గాక!,

ఓం తత్ సత్ ఓమ్.
జై మలయాళ మౌనీంద్ర!
జై జై మలయాళమౌనీంద్ర!!

**ఏకాగ్రచిత్తంతో భగవంతుని పాదపద్మాలను ధ్యానించే వారికి 'మోక్షం' కరతలామలకం అవుతుంది.**

**– *శ్రీ ఓంకారానంద బ్రహ్మచారి***